**GUDU VADILINA GUVVALU**
**NAANEELU** *(Epigrams)*

*By*
S.R. BHALLAM



*First Edition:* December, 2000
*Copies:* 1,000

*Drawings & Cover Design:*
UDAY KUMAR

*Price:* Rs. 25/-

*For Copies:*
VISALANDHRA PUBLISHING HOUSE
4-1-435, Bank Street
Vignan Bhavan, Hyderabad - 500 003
and all it's Branches
*and*
CRESCENT PUBLICATIONS
Vijayawada - 2

*Published by:*
RACHANA SAAHITI GRUHAM
Lankalakoderu - 534 250
W.G. Dist., A.P.
Ph : 08814 - 58572

*Composed by:*
VAMSI GRAPHICS
Palakol, W.G. Dt.

*Printed by:*
CRESCENT PUBLICATIONS
Vijayawada - 2

# అంకితం



హఠాత్తుగా
నానీల జ్వరం పట్టుకుంది
కారణం వైద్యుడే
అతడు డా॥ గోపి

# ఉదార హృదయులైన...

"జ్ఞానపీఠ అవార్డు గ్రహీత" **డా॥ సి. నారాయణరెడ్డి** గారికి,

నానీల సృష్టికర్త – ఈ "గూడు వదిలిన గువ్వలు" కృతి భర్త
తెలుగు యూనివర్సిటీ వైస్ చాన్సలర్ **డా॥ ఎన్. గోపీ** గారికి.

వారి సతీమణి **శ్రీమతి అరుణ** గారికి,

జాతీయకవి – **డా॥ నాగభైరవ కోటేశ్వరరావు** గారికి,

ప్రముఖ సాహితీ విమర్శకులు – **డా॥ ద్వా.నా. శాస్త్రి** గారికి,

ప్రజాకవి **డా॥ అద్దేపల్లి రామమోహనరావు** గారికి,

విద్వత్కవి – **డా॥ బేతవోలు రామబ్రహ్మం** గారికి,

"వర్తమాన కవి" – **డా॥ ఎండ్లూరి సుధాకరరావు** గారికి,

వడ్లబండ కవి – **భగ్వాన్** గారికి,

"లోయలో మనిషి" కవి **సోమేపల్లి వెంకట సుబ్బయ్య** గారికి,

**డా॥ సిహెచ్. సత్యనారాయణ మూర్తి** గారికి,

**డా॥ చలంచర్ల శ్రీనివాసరావు** గారికి,

**డా॥ గమిడి గణేష్** గారికి,

మావూరు "కవిటం" గ్రామ మహనీయులు – **సత్తి వెంకటరెడ్డి** గారికి,

**కర్రి రాధాకృష్ణారెడ్డి** గారికి,

"కంప్యూటర్ విజ్ఞానం" ఎడిటర్ – **ఎమ్. రామారావు** గారికి,

ఆడిటర్ **పి. లక్ష్మీనారాయణ** గారికి,

దానశీలి – **బొండాడ వెంకట రాధారమణ గుప్త** గారికి,

వంశీ గ్రాఫిక్స్ – **శర్మ** గారికి,

ప్రియమిత్రులు ఆర్టిస్ట్ **ఉదయ్** గారికి,

నా అర్ధాంగి **సామ్రాజ్యలక్ష్మి**... ఇంకా ఎందరో... అందరికీ...

**కృతజ్ఞతలు**

# నానీలు బాటలో భల్లం

— డా॥ ద్వానా శాస్త్రి

కవిత్వం కాలానికి అనుగుణంగా తనకు కావలసిన రూపాన్ని తానే ఎంచుకుంటుంది. దానికి కవి సాధనమవుతాడు. ఆధునిక కవితా రూపాలలో అత్యాధునిక రూపం "నానీలు". ఇది విశిష్ట కవితారూపం ఎందుకైంది అంటే -

ఇది నియమ నిబంధనలు లేనిది కాదు.
దిగుమతి చేసుకున్నదీ కాదు.
భావ కవిత్వం, అనుభూతి కవిత్వంలాగా కేవల అంతర్ముఖత్వ లక్షణం కలదీ కాదు.
అస్పష్టతను ఆదరించేది అంతకంటే కాదు.
సామాజికత, సమకాలీనత అనే గుణాలు ప్రధానంగా గల రూపం.
అందరూ ఆస్వాదించగలిగేది కూడా !

అసలు నానీల సృష్టికర్త తెలుగు యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ డా॥ ఎన్. గోపి. "వార్త" దినపత్రికలో హఠాత్తుగా నానీలు అచ్చయినప్పుడు అందరి దృష్టిని ఆకర్షించాయి. ముఖ్యంగా నానీల ద్వారా అప్పుడు కవిత్వం పాపులర్ అయింది. దాంతో నానీల జ్వరం చాలామందికి సోకింది. ఆ జ్వరాన్ని పోగొట్టుకోడానికి - ఎస్. రఘు, కోట్ల వెంకటేశ్వర రెడ్డి, శిరీషలు నానీల బాణీలో కవితలు రాశారు. కాని అవి నియమబద్ధమైన నానీలు కావు.

అటువంటి సమయంలో - ఆచార్య ఎన్. గోపి నానీల తొలి వారసునిగా ఎన్.ఆర్.భల్లం సామాజికాంశ వస్తు వైవిధ్యభరితమైన నానీలతో మనముందుకొస్తున్నాడు. సాహిత్య విమర్శకునిగా .. "నీటిభూమి" కవిగా ఎస్.ఆర్.భల్లం (భల్లం సూర్యనారాయణరాజు, లంకలకోడేరు, ప॥గో॥ జిల్లా) పత్రికా ప్రపంచానికి పరిచితుడే. ఇటీవల చిమ్మపూడి శ్రీరామమూర్తి, సోమేపల్లి వెంకట సుబ్బయ్య, రసరాజు, ఆర్టిస్ట్ ఉదయ్, కోసూరి గాంధీ వంటి కవులనేకులు నానీలు రాస్తున్నారు. అంటే గోపి ఒక కొత్త కవితారూపానికి మార్గదర్శకుడయ్యాడు - ట్రెండ్ సెట్టర్ అన్నమాట".

ఇంతకీ నానీలంటే .. "నావీ, నీవీ, వెరసి మనవి" అన్నాడు గోపి. అలా అనటంలో ఎంత ఆత్మీయత వుంది? "నాయనా ఇవి ఎక్కడివోకాదు ... మీరు ఎక్కడికో వెళ్లక్కర్లేదు ... ఇవి మనవే" అన్న ఆదరణ వుంది. చిన్నవాళ్లని ముద్దుగా, మురిపంగా 'నానీ' అని పిలుస్తారు. అలాగే నానిబాబు, నానిగాడు అనటమూ కద్దు. చిన్న కవితని "నాని" అనడం దేశీయత. "నానీలు ఎలా రాసినా నానీలే' అనడానికి వీలు లేదు. కొన్ని బిగింపులూ, నియమాలూ లేకపోలేదు నానీల సామాన్య లక్షణాలుగా -

- నాలుగు పాదాలుంటాయి.
- మొత్తం మీద 20-25 అక్షరాలుంటాయి.
- రెండేసి పాదాలను (సామాన్యంగా) ఒక భావాంశంగా (యూనిట్‌గా) గుర్తించవచ్చు.
- మొదటి భావాంశాన్ని రెండోది పూరించేదిగానో, సమర్థించేది గానో, దృష్టాంతంగానో వుంటుంది అనవచ్చు.

ఇక ప్రధాన లక్షణాలుగా ...

నానీలలో ప్రకృతి వర్ణనలు వున్నా, అనుభూతి వున్నా, చమత్కృతి వున్నా అవి సమకాలీనతతో ముడివేసుకోవడం గమనిస్తాం.

ఏదో గంభీరమైన గొప్ప విషయం చెబుతున్న 'ఫోజు' కనిపించదు. కాని గంభీర వుంటుంది. గాఢత వుంటుంది. అంటే సామాజికీకరణ అలతి అలతి మాటలలో అగుపించి అంతరంగాన్ని అలరిస్తుందన్నమాట.

ఇంత అవగాహన ఉన్నప్పుడే ఈ కవితా రూపం వశమవుతుంది. ఇలా వశపరచుకున్న నాణ్యమైన నానీలు కవి ఎస్.ఆర్. భల్లం.

"గూడు వదిలిన గువ్వలు" లోని అన్ని నానీలు నియమ నిబంధనల ప్రకారం వ్రాసినవే. ఇందులో మంచివి వున్నాయి. చాలా మంచివి వున్నాయి, ఒక మాదిరివి వున్నాయి. ఏ కవితా సంపుటికైనా సారూప్యంగా ఇదే స్థితి వుంటుంది

"పుస్తకం
మూసేసాను కానీ
మస్తిష్కం
విసురుగా తెరుచుకుంది"

ఇందులో మొదటి భావాంశానికి రెండో భావాంశంలో సమన్వయం వుంది. ఏది చదివినా మస్తిష్కం పనిచెయ్యడం ప్రారంభించాలి. అదే 'చదువు' అవుతుంది. చదివిన ముందూ - తర్వాత కూడా మెదడు ఒకేలా వుంటే చదువూ, ఆ పుస్తకమూ నిరర్థకమే సుమా అన్న భావం వుంది. "విసురుగా" అనడం వల్ల స్పందన ఎంత త్వరగా వుందో తెలుస్తుంది. చదువు సార్థకతను సమర్థిస్తోంది రెండో యూనిట్.

"పాపాయి
నిద్రపోతుంది
కలలో
మేలుకొని ఆడుకోడానికి"

అస్పష్టతలేని, అసలైన అనుభూతి నానీ ఇది. పాపాయి మేల్కొని ఆడుకుంటూ వుంటే ఏ పనీ సాగదు. అల్లరిగా వుంటుంది. ఓపికా వుండదు. అందుకని జోకొడతారు. పాపాయి కూడా వీళ్ళ గోల భరించలేక నిద్రపోతుంది. ఎందుకంటే నిద్రలో కలలోనైనా స్వేచ్ఛగా, హాయిగా ఆడుకోవచ్చని, కాబట్టి నిద్రపుచ్చి ఆ మంచిపనైనా చేయండి - అంటున్నాడా కవి ....?

"సిక్సర్ కొడితే
ఎన్ని చప్పట్లు కొట్టేవాడివి
ఇప్పుడు
కొట్టు చూద్దాం"

-నానీలలో వుండే సమకాలీనతకి, సాంద్రతకి ఇదొక గొప్ప నిదర్శనం. మ్యాచ్‌ఫిక్సింగ్‌పై ఎస్.ఆర్.భల్లం వదిలిన వ్యంగ్యాస్త్రం ఇది.

"దీపంతో
పోల్చక్కర్లేదు
కిరోసిన్‌కి
అర్పించకుంటే చాలు"

- ఇది నానీలలో సామాజిక స్పృహను ఎంత బలంగా చిత్రించవచ్చో తెలుపుతుంది. "ఇంటికి దీపం ఇల్లాలు" పై అధిక్షేపం, కట్నంపై ఝుళిపింపు. పురుషాధిక్యంపై ఓ చరుపు. ఇందులో రెండు భావాంశాలూ "నెగిటివ్" గానే చెప్పబడినా "పాజిటివ్" గా జాగ్రత్తగా చూసుకో" అన్న హితవు వుంది. ఈ నానీ శిల్పవైవిధ్యానికి ప్రతీకగా చెప్పవచ్చు.

"సైబర్ నేరానికి
సాక్ష్యం కావాలా ...?
అదొక
పెద్ద "కోలా" హాలం

- ఇందులో నాలుగోపాదంలో శబ్దధ్వని వుంది. మొదటి భావాంశం ప్రశ్న. రెండవది చమత్కారపూరమైన పూరకం.

ఇలా చాలావాటిని విశ్లేషించుకుంటే నానీల మహత్మ్యం వెల్లడవుతుంది. "బోలుమాటలు" "ఆసుపోయడం" "పొట్ట కోడుతుంది' "గిలగిలా" "ఎటొచ్చీ" "బోల్డంత" "కప్పెక్కి" "చప్పరింత" వంటి తెలుగు పలుకుబడులు అలరిస్తాయి. "నీడపట్టు స్వప్నాలు" "గాలితీగమీద అల్లరి రాగాలు" "మొగ్గపెదాల చిలిపినవ్వు' ' "తుంపర్ల ముంగుర్లతో విసిరి కొట్టడం" "చీకటి పరదాకి వెల్ల వేసినట్లు" "గుండె వేళ్ళు పుటక నేల్లోకే..' వంటి కవితా పంక్తులు ఎపుడూ మన మనోముకురంపై ప్రతిఫలిస్తాయి.

"పదాల వాడకంలో పొందిక వున్నవాడే నానీల కవి కాగలడు. ఆ గుణం గల ప్రతిభావంతుడు ఎస్.ఆర్.భల్లం.

"కొని తెచ్చుకొన్న
బింకం
ఎంతకాలం
నిజం నిలకడ మీదే"

వంటి సామాన్యమైన నానీలు లేకపోలేదు. అయితే అన్నిస్థాయిల వాళ్ళని అలరించడానికి సామాన్య కవితలూ అవసరమే - అనే వాళ్ళు వుంటారు. ఏమైనా కొన్ని వడపోసి వుండవల్సింది.

"అమ్మయ్య
ఆకలి తీరిపోయింది
కొన్ని నానీలు
తిన్నానుగా మరి ....."

అని భల్లం అన్నట్టు మీకు ఆకలి తీరుతుంది. వీటిని చదువుతున్నప్పడే మీ మెదడు పనిచేయడం మొదలవుతుంది. గోపీ నానీలు లాగా భల్లం నానీలు కూడా విశేషాదరణకి నోచుకుంటాయని నా నమ్మకం ... !!

నిజానికి
కోకిల పాడదు
చిగురు గర్భంలో
పాటను వెలికి తీస్తుంది

ప్లీజ్ .....
ఏదో ఒకటి మాట్లాడు
మౌనం కొండను
మోయడం ఎంత కష్టం!?

చేదు తీపి
రాత్రి పగలు
ఆసు పోయడమే
అరుదైన జీవితం



ఊహల్లోనే
ఊరు పచ్చదనం
నిజానికది
గడ్డ కట్టిన రక్తసముద్రం

గుప్పెడు
గుండెనిండా సముద్రాలు
అందుకే
కళ్ళల్లో ఎపుడూ అలలు

మమకారపు -
మహాకావ్యానికి ...
ముందుమాట
ఎపుడూ అమ్మే



కోపంతో
చిరిగిన వాతావరణం
సహనంతో
కుట్టు వేయాలి మరి ....

గాయం కూడా
ఓ గురువే
భరించక తప్పదు
బాధల బరువు

నోరు నవ్వి
నొసలు వెక్కిరించిందా ...?
అది
నిజంగా మనిషి పనే ...!



చురకత్తిలా
గాలిని చీల్చిన పక్షి
గాయం కోసం కాదు
గమ్యం కోసం .

మునుపటి
వేగం లేదేం ... !?
తెలిసింది
తోడు లేకుంటే అంతే మరి .....

మాటలు
శబ్దించక పోతే ఎలా ...?
విత్తనాలు
మొలకెత్తనట్లు ....



13. తామరాకుమీద
నీటిబొట్టు
మెల్లగా జారింది
గుండె లోతుల్లోకి .....

14. ఉన్నపళంగా
ఊళ్ళకేమయ్యింది
అడవి
పిలిచింది కాబోలు ..... !!

15. మాటల -
తేనెటీగలు
తీపికంటే -
గాట్లే ఎక్కువయ్యాయి ఏమిటి ...?



కంటి తడిలో
గాలి తడిసిందా
అవును
వేడెక్కింది కూడా ...

ఎన్ని అనుభూతులని
మూటకట్టేది .....?
గుండె
చిరుగుల్లోంచి జారిపోతుంటే ...

చూపుకి
దొరికిందా దృశ్యం
గుండెల్లోకి
జారకపోతే వ్యర్థమది



ఆలుమగల -
అలకలు
అద్దం మీద -
మాయమయ్యే మరకలు

గతం
వర్తమానం
రెండు తీరాల మధ్య
గిలగిలా కొట్టుకునే కాలం

పారతో చేస్తున్న
గాయం కాదిది
పుడమి తల్లి
గుండె నిమరడమే ... !!



ముళ్ళమీద
లేత అరిటాకు
తర్వాత
అది కకావికల కావ్యం

యాత్ర అంటే
ప్రయాణం కాదు
నీలోకి
నువ్వుగా వెళ్ళే ప్రవాహం

నిజానికవి
బోలు మాటలు
వలిచి చూడు
లోపల విత్తులు లేవు



చాలింక
కులం కుంపటి రగిలించడం
పట్నంతో పాటు
పల్లెకీ ...!!

చిదుముతావేం‌టి
ఆలోచనల్ని ...
మళ్ళీ మొలవడం
ఎంతోసేపు కాదు

ఎండ
ఎండే మరి ...
కొబ్బరాకుల దయవల్ల
చిత్రంగా మారిపోయింది



రాయితో కొట్టినా
తుంపర్లనే పూస్తుంది
నీరు అంటే
అంతేమరి ...!!

దూరంగా
తొలగిపోకు
ఆ దూరంలో కూడా
అస్పష్టంగా నేనే మరి ....!

నాగలి
పొలం గుండెల్ని చీల్చదు
జీవశక్తిని
పేలుస్తుంది



మనిషి
జ్ఞాపకమొచ్చాడెందుకు ....?
గాయం
మళ్ళీ రేగింది కాబట్టి :....

పాలకంకి మీద
పిట్టగాటు
అది
రైతు పొట్ట కొడుతుంది

అక్కడనుంచి
ఇక్కడికి గంతులు
రాజకీయ -
మర్కటాలు



ఎంచక్కా
ఏరు దాటేశాం కదా !
తెప్పలేదు
తగలేసి పోదానికి .....

వాడితో
ఒక్కసారి మాటాడి చూడు
నీటిమీద
నూనె జిడ్డులా తేల్తావు

వెదురు కర్రలో
వాయువుకి
ఆయువు పోయడమే
సంగీతం ....!



దండకో .....
దండకానికో
తలలూపే వారు
గుండె తడిని గుర్తించలేరు

విసరబడ్డ
వలలకేం తెలుసు ...?
పదేవి నీళ్ళుకావు
చేపలని .....

పహరా వుంది
నిజమే
ఊరు
పహరాకారుదెవరో తెలిస్తేగా ...?



అమ్మ
తలను నిమురుతుంటే
నిద్ర
రెప్పలమీంచి దిగుతుంది

చెవుల దొప్పల్లో
పాట దీపాలు
కనిపించే
సంగీతమంటే యిదే ....

ఎక్కడ
పడితే అక్కడ ...!
అసూయే కాదు
ఆత్మీయత కూడా ...



చీకు
చింతల చితిని -
చిరునవ్వు తుంపర్లతో
ఆర్పుకోవచ్చేమో ...!!

ఆ వయసు
ఎలాంటిదంటే .....
తుళ్ళింతల తూనీగకి
తోకలు పెట్టినట్లు .....

అందాల పోటీల్లో
చూపులే కొలమానాలు
దేహాంగాలు
అధ్యయన కేంద్రాలు



గతంలోంచా
వర్తమానం లోంచా ...
ఎక్కడ పుట్టింది
ఈ కన్నీటి బొట్టు

విషాదం తర్వాత
ఒకింత ఉపశమనం
చిట్లిన చిమ్నీ
అతికించినట్లు .....

చిరకాలపు
మిత్రురాలు
గుండె అల్మారాలో
అద్భుత జ్ఞాపిక



ముగ్గుల మధ్య
కప్పుదాట్లు
జారుతుందని కాదు
చెరుగుతుందని .....

చెట్టు ఆకుల్ని
జార్చుకుంటుందా
రేపటి
పచ్చని చీరని ఊహించుకుంటాను

ఎర్రగులాబి
తెల్లపావురం
ఏది కావాలంటే
రెండూనూ .....



మనసు
బాల్యంలో తేలుతుంది
ఊహేగా
ఊరేగిపోనీ కాసేపు ...!

అసంతృప్తి
మండువేసవిలో
తుంపర కాదు
వేరు కుంపటి

కొల్లేరు నిండా
కొంగల అక్షరాలు
వలస
మహాకావ్యమంటే యిదే ... !!



ఎంత
ఆకాశంలో ఎగిరినా
నేల
నీ కాళ్ళకు అంటుకునే ఉంటుంది

పాలు
చేపని పొదుగు
కునుకు తీయని ఊరు
ఒకటేనేమో ....!

ఎంత
పెద్ద జలపాతమో
తుంపర్ల ముంగుర్లతో
విసిరి కొడ్తుంది



కత్తి వాదర మీద
ఆత్మ
భయం కీనీడలో
జీవనయానం

చలి కౌగిలిలో
ముదుసలి
కడుపులో
బిడ్డ ఆసనంలా ...

పసిపిల్లల్ని
అదిలించకు
అల్లరి
దూది పింఛమై ఎగురుతుంది



ప్రతిభకు
పురస్కారం
అలసత్వానికి
అది తిరస్కారం

మొగ్గ పెదాల
చిలిపి నవ్వుకి
హృదయం
తడి తాకిన వరిమడి

అమ్మా నాన్నా
ఎండా వానా
పిల్లలు
ఇంద్రధనస్సు విరిసిన రంగులు



గడ్డిపరక మీద
మంచుబిందువు
అంత చిన్నదే
అనంతం దాన్నిండా .....

నేను
నేనుగానే
పరిచయం పలకరింపు
ఇంకా మొదట్లోనే

చెలిమి చెలమ
ఎండిపోతున్నా
గుండెవేళ్ళు
పుటక నేల్లోకే ....



మాటకి
మాటకి ఎంత దూరమో
ఆత్మకు
ఆత్మ అంతే దూరం

పరకల్ని
తాడుగా పేనినట్లు
దూరాల్నించి
నదుల్ని అల్లుతున్నదెవరో ....!

ఎత్తిన చేయి
దిగిందేం ....?
శత్రువు కూడా
మనలాంటి మనిషేగా .....



పిట్ట
ఎగిరిందో వాలిందో
చెట్టు గర్భంలో మాత్రం
కలకలం !

బాల్యం కోటుకి
ఎర్రగులాబి
జ్ఞాపకాల గోడకి
చాచా నెహ్రూ

అనుమాన మేఘం
పశ్చాత్తాపం
బొట్టుబొట్టుగా –
దుఃఖించదమే .....



కాలుష్యం
ఎలా ప్రవహిస్తుందో చూడు
పచ్చదనాన్ని
చప్పరించుకుంటూ .....

కంఠనాళాల్ని
కత్తిరించకు
కలస్వనం
ఆగిపోతుంది కదా ....!

కొనితెచ్చుకున్న
బింకం
ఎంతకాలం ....?
నిజం నిలకడమీదే



రైలు
పరుగెడుతుంది
చేతులు ఊపడానికి
పిల్లలు లేరుగా .... !

ముందుమాట
ఎంత బాగుందో ...?
వెనుక మాట
వెగటుని కప్పిపుచ్చడానికి

పున్నమి
వెన్నెల
చీకటి పరదాకి
వెల్ల వేసినట్లుగా .....



చేప
విడిచిన కొలను
బిడ్డకై
విలవిల్లాడే అమ్మ మనసు

పిల్లలు
ఆడుకుంటున్నారు
గాలి తీగమీద
అల్లరి రాగాలు

మాపును
నాటాను
మానస మాగాణీపై
మొలిచింది ప్రేమ మొలక



ప్రశ్నతో ప్రశ్న
ఎంతగా ఘర్షించినా
రాలుతుందా
సమాధానం ...!?

బడిని
ఇంటికి తెచ్చారు
బడి కాస్తా
అమ్మ వొడిగా మారిపోయింది

బారెడు
నేల తడిసేందుకు
పొలాల్లో ప్రవహించేది
నీరు బదులు పోరు



పాపాయి
నిద్రపోతుంది
కలలో
మేలుకోని ఆడుకోడానికి ....

పుస్తకం
మూసేసాను కానీ -
మస్తిష్కం
విసురుగా తెరుచుకుంది

హాస్యానికా ...
అసహాస్యానికా ...
మాట ఈటెలా
మనసులో నాటావ్



ఎంత
మురికి పడితేనేం
వదిలించడానికి
ఎపుడూ అమ్మ సిద్ధం

మాటలు
కొత్తవేం కాదు
మనసులింకా
పాతపడలేదంతే ....!

సిక్సర్ కొడితే
ఎన్ని చప్పట్లు కొట్టేవాడివి
ఇప్పుడు
కొట్టు చూద్దాం ...!



మెతుకు మెతుక్కీ
పుల మార్తుంది
బాల్యంలో బడిని
పలకరించి రావాలి

నీడ
లోయలోకి జారినా
పర్వతం
ఎత్తు తరిగిపోదుగా ....!

మాట
అర్థం కాకపోడానికి
భాషే కాదు
మనసు కూడా కారణమే !



తులసికోట
తునా తునకలైతేనేం ..... ?
మొక్కా
మొక్కుబడీ పదిలమేగా ....!

అంత
ఆశ్చర్యమెందుకు ...?
ఒక్కోసారి
రాతిగుండె కూడా ద్రవిస్తుంది

పడవలోని
చుక్కానే కాదు
తెరచాపలోని
చిరుగూ ప్రయాణిస్తుంది



నమ్మకం
ముక్కలైనప్పుడు
ఏం మాటలు చెప్పినా
అది అతుక్కోదు

వాడేంటి
ఇన్ని చక్కర్లు కొడుతున్నాడు
అవును
వాడిది ఆషాడభూతి అంశ

మైకు ముందు
మహనీయుడే
మైకంలో
మరో మహిళాసురుడు



దీపంతో
పోల్చనక్కర్లేదు
కిరోసిన్‌కి
అర్పించకుంటే చాలు

బెదరగొట్టి
అల్లరిని ఆపలేవు
కాస్త ప్రేమగా చూడు
పసి సంగీతం

వేదన
ఎవరికి ముద్దు ...?
హద్దు దాటినప్పుడు
మరీ ప్రమాదం



సమస్యలు
అందరికీ ఉంటాయి
నువ్వే
కప్పెక్కి అరుస్తున్నావు

ఎందుకా
విపరీత వేగం ...?
మరణాన్ని
కౌగలించుకోడానికా ...!?

ఓర్పు చేసే మేలు
నేర్పు కూడా చేయదు
కారణం
అదే చివరి తీర్పు



బతుకు చెట్టుకి
మరో పువ్వు
అది నవ్వుల్ని
సృష్టిస్తుందో ... హరిస్తుందో ...

అనుభవించడానికే కాదు
జీవితం
ఆ సారాన్ని
విప్పి చెప్పడానిక్కూడా ...

ప్రాణులకే
అనుకొన్నాం జబ్బులు
కంప్యూటర్లకి కూడా
ఉంటాయట



ముంబాయిలో
దొంగలున్నారు జాగ్రత్త
ఆర్కేడ్ సెంటర్‌లో
గుండె దోచిందామ్మాయి

ముసలితనంలో
పరుగులా ...?
నిధి తరుగుతుంటే
వ్యయం పెరుగుతుంది

మనుషుల్ని
కలిపేది రక్తమేనంటావా
కాదు
రక్తస్పందన



గాయం
మచ్చగా మిగులుతుంది
గేయం
పుట్టుమచ్చై నిలస్తుంది

దేనికైనా
అదుపు చేసుకోవడం ముఖ్యం
నాలికకి
మరీ ముఖ్యం

మాటకీ మాటకీ మధ్య
మౌనం ఉంటేనే
మాటకి
విలువ పెరిగేది



కుంటితనం
ఉంటే మాత్రమేమి
కుంఠిత మనస్కత
లేకుంటే చాలు

చెలరేగే
పిల్లల కాంక్షలను
భయపడే
పెద్దల ఆంక్షలు ఆపుతాయా ...?

ఎటు పరుగులు తీసినా
భవిష్యత్తులోకే ...
బాల్యంలోకి -
వెళ్ళలేవు



ఇంట్లోనూ
జ్ఞానులుంటారు
అతి పరిచయం వల్ల
అజ్ఞానులమవుతామంతే

తన కోపమే
తన శత్రువు అంటారు
అంతే కాదు
అదందరికీ శత్రువు

అవమానం
కబళించిందా
పర్వాలేదు
తర్వాతది సన్మానమే !



బరువు
ఆ వస్తువులో వుండదు
మోయడంలేనే
దాగుంటుంది

మగ్గం గోతిలో
పాతుకుపోయాయి
చేనేత బతుకులంటే
ఇంతే మరి

నీడపట్టు
స్వప్నాలకేంగాని
ఎండలో కరిగిపోనివే
నిజమైన కలలు



ఆశ
ఎపుడూ గణనీయమే
ఎటొచ్చీ
నిరాశే అశనిపాతం

ప్రతికూల
వాతావరణ ప్రవాహంలో
ప్రబ్బలి చెట్టే
ఆదర్శమేమో ...

రైతుకీ
ధాన్యానికీ బంధం తెగిపోయింది
మిల్లులో నలిగేవి
బతుకులు కూడా ...



చూరుకి
వరికంకుల గుత్తి
పిచ్చికల నోట
ఆకలి ముత్యాలు

హృదయవేదికపై
చిరుపాదాల నాట్యం
ఆ తన్నులు
తినని జన్మ జన్మే ....!?

ఎంత చక్కగా
సాపు చేస్తుంది ఇస్త్రీపెట్టె
అసమానతలతో
నేనూ అంతే ...



గోడమీద
నీలిబొమ్మ
అందుకా
వరదగుండె చెలరేగింది ...!

అలజడులకు
అదిరేది లేదు
అక్షరాల్ని ఆయుధాలుగా
సంధిస్తాను

ఎక్కడకి
ఎగిరిపోవాలి
రెక్కల
దుప్పటి కప్పుకొని ...



అందలాలు
ఎక్కించి ఏమి లాభం !:
సందుల్లో
వెక్కిరించకుంటే చాలు ...

నేస్తం
నువ్వే నాకు సమస్తం
గుండె గూట్లో
ఊపిరి గువ్వ ఉన్నంతవరకూ ...

అనుభవాలకై
తొందరేల ....?
నూరేళ్ళ బ్రతుకు
పాతికేళ్ళకే కుక్కినట్లు ....



దూదిని
ఏకుతుంటే
దారానికి బదులు
కన్నీటి హారం తయారైంది

మౌనం
మంచిదే కానీ ...
ఒక్కొక్కప్పుడు
శబ్దం కంటే ప్రమాదం

బాల్యాన్ని
గుర్తు చేసుకోవడమంటే
జీవితాన్ని
తడిమి చూసుకోవడమే ...



చల్ది బువ్వలో
ఊరగాయ
ఎన్నాళ్ళదాకా
పరిమళిస్తుంది

బియ్యపు గింజపై
చిత్రం అమృతమే
అది అన్నంగా మారితే
మరీ అందం

పిల్లలు
లేకపోతేనేం
బోళ్ళంత
పసితనం గుండెల్లో ఉందిగా ...



ద్వేషం
దేహమంతా వ్యాపించింది
మాట
తూటాలా పేలడమే ఆలస్యం

తూగుడు బల్లే
జీవితం కాదు
చలనం తప్ప
పురోగమనం లేదు

దుఃఖం
సర్వవ్యాపి
నింగిని పిండి
నేలను తడిపినట్లుగా ...



వేసవి సెలవుల్లో
వెళ్ళమంటే
కాశ్మీరుకి కాదు
కన్నవారింటికి ...

నిజానికి
వ్యవసాయం జూదం కాదు
అయినా
గెలుపు ఓటములున్నాయి

సైబర్ నేరానికి
సాక్ష్యం కావాలా ...?
అదొక
పెద్ద 'కోలా' హలం ... !!



పలక ముక్కలైతే
ఓనమాలు మాసిపోవు
గుండెలో
అవి ముద్రితమే ...

అనుమానానిది
ధృతరాష్ట్ర కౌగిలి
వదిలించుకోకుంటే
బతుకు బలి ...

అమ్మయ్య
ఆకలి తీరిపోయింది
కొన్ని నానీలు
తిన్నానుగా మరి ...!

